# పీఠిక.

మహాశయులారా !

శ్రీ భగవదనుగ్రహీతములగు నాయూహల నప్పటికప్పుడు ప
రూపములుగా సమకూర్చి యుంచగా, వానిని సంపుటిగాఁజేసిన నామి
లగు బ్రహ్మశ్రీ మురాశి రామారావుగారికి ముందుగా నాకృతజ్ఞత తె
ఋచ్చి, పిమ్మట నాపుస్తకాకార కన్యకకు, సుగుణ గణములనేర్చి, వం
జనాద్ధరణమును జడయురీతుల బోధించి, సర్వాలంకార శోభితం గావిం
మంగళాశీః పూర్వకముగా నన్నానందింపఁజేసిన బ్రహ్మశ్రీ త్యాడి వెం
శాస్త్రిగారికి నానమోవాకముల నందఁజేయుచున్నాను. వారియనుమతి
నీసంపుటికి ఖండకావ్యనామమిడితిని. నీరక్షీర న్యాయముగా దీనినిఁబరిశీలిం
నన్నింతోధిక రచనలుగలవానిగాఁ బ్రోత్సహింపఁగలందులకై పాఠకు
సంప్రార్థితులరు.

సోదర ప్రేమచే నన్నానందింపఁజేయ
దలఁచి, యీనాచిన్ని పొత్తమును లోకమున కందఁజేయుటకై ముద్రిం
చిన, మూడుగుల పురనివాస శ్రీ బాల వైశ్య సంఘ త్యాగమున కెం
యు సంతోషిత స్వాంతుండనై యూపగమేశ్వరుఁడా సంఘమున కాయు
రోగ్యముల నొసంగుగాకయని యాశీర్వదించుచున్నాను. ఇత్తోధిక సత్కా
రాచరణమతిని నాసంఘమునకొసంగుచు సర్వవిధముల దానికిఁ దోడ్పడ
టకై భగవంతునిఁ బ్రార్థించుచున్నాను.

(1) శ్రీబాల వైశ్య సంఘాయ ధన ధాన్యాది దస్సదా
ముదా, రక్షతు, సత్కార్యబుద్ధిం దత్వాశివోహ్యదా

(2) ప్రోఁచుగావుత మూడ్గుల పురమునందుఁ
గలుగు శ్రీ బాల వైశ్య సంఘమున కమిత
ధనము నారోగ్యమాయువుఁ దనయవరుల
నిచ్చి, సిచ్చలు, ముదమున, లచ్చిమగఁడు.

ఇట్లు,
సుజనవిధేయుఁడు
అన్నాపంతుల చిరంజీవిశాస్త్రి.

# తొలి పలుకు.

శ్రీ అన్నావంతుల చిరంజీవిశాస్త్రిగారు రచించిన "ఖండకావ్యము" ను పరిశీలించి, విశేష పరితోషమునందితిని. వీరు సంస్కృత శ్లోకములతో గ్రంథము నారంభించిరి. జ్యోతిర్మయమైనది సంస్కృత వాఙ్మయము సమాధిస్థులైన మంత్రి ద్రష్టలుచ్చరించిన బీజాక్షరయుత మహావాక్యములతో పరిఢవిల్లు దేవసారస్వతము కళోపాసకులకు తన్మయత్వమొసరంచునది. ఉదాత్తాశయప్రదీప్తమైన, భారతీయ సాహిత్య సంప్రదాయము ననుసరించు శ్రీ శాస్త్రిగారి కవితాశక్తి అద్భుతమైనదని తెలుపుట కానందించుచున్నాను. వీరి పద్యములు గంభీరభావబంధురములై వె[illegible] అవిరతముగ ప్రవహించు సురధుని పూరమువలె వీరి కవితాధార వెలాయుచున్నది. రసబంధురమై ఔచిత్య సమన్వితమై ధ్వనిగర్భితమై సుందరశయ్యావిలసితమై వీరి కావ్యమొప్పుచున్నది, ఇంప్రశారదకిది చక్కనికై సేత. కాగలరని విశ్వసించుచున్నాను. కవితాక్షేత్రమున ముందంజవేయువలెనని యుద్దేశించువారీ గ్రంథమును పఠించి అనల్పమైన అభ్యుదయమునందగలరు.

దాస్యశృంఖలములనుండి విడివడిన భారతాంబ నేడు తొల్లింటిశక్తితో తేజరిల్లగాలును నైసర్గిక ప్రతిభా సమన్వితులయిన యువకులువిశేషోత్సాహముతో శుభతరమయిన ప్రజ్ఞతో భారతిని భారతాంబను సేవింపగాలు మంగళమహూర్తము వన భాగ్యవశమున గోచరించినది శ్రీ చిరంజీవి శాస్త్రిగారు నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞతో సౌందర్య సందీపితములయిన కృతులను బహుళముగ రచించి మానవ సముద్ధరణమునకు మిగుల నక్కరైన భావములను రత్నములల్లు జగతియందు వెదజల్లి ధన్యజీవులయ్యెదరని ఆశపడుచున్నాను. సహృదయులు వీరికృషిపై శుభాక్షతలు చల్లెదరని నమ్ముచున్నాను.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, M. A, B. L, B. T. P. ETC.
అధ్యాపకుడు ఎస్. ఆర్. ఆర్. ఎండు సి ఆర్. కాలేజి,
విజయవాడ.

# ఆశీరాశయః

(1)

శ్రీవాగ్హైమవతీ భర్తృత్రితయాత్మక రక్షక

స్సర్వాభీష్టాయు రారోగ్య వృత్తి ప్రదతయాఽభవ॥

(2)

అన్నాపంతుల గోత్రాబ్ధిపూర్ణకైరవ బాన్ధవమ్

గీర్వాణాంధ్ర ప్రవీణం చ చిరంజీవి మనీషిణామ్॥

(3)

సాహితీ కవితాజాత మాధురీ సుధయాముదా

రసగ్రహణ పారీణ శేముషీణాం ప్రమోదదమ్॥

(4)

మార్దవ ప్రౌఢలాలిత్యశబ్దమేళన ధీయుతమ్

శాన్త సౌశీల్య సల్లాప స్థిరభూషాభి శోభితమ్॥

(5)

జ్ఞాన బ్రహ్మత్వ విజ్ఞాన హృదయాహ్లాద పూరితమ్

పాత్రౌచిత్య పరిజ్ఞాన బ్రహ్మతా పూత జీవితమ్॥

ఇట్లు,

విద్వాన్, త్యాడి వెంకటశాస్త్రి,

ఆథర్.

— శ్రీకామేశ్వరీమహాదేవ్యైనమః —

# —• కృతి సమర్పణము

———o———

శ్రీ రూపే! దేహిదత్తాని మయామద్గ్రహ దేవతే
స్వీకృత్య పద్య కుసుమాన్యమాని పదవీం శుభామ్,

## —శ్రీ కామేశ్వరీ స్తోత్రమ్.—

——o——

1

దేవి! త్వద్గుణవర్ణనం బహు ముఖాః ధాత్రాదయః ప్రారభన్
కర్తుం త్వం వదత్వంవదేతి కలహం చక్రుర్న శక్తా మిథః
తేషాం సర్వవిభుస్సహాస్రముఖ సంభావాత్ప్రవృత్యస్తుతిం
శేషత్వం గమితో౽ప్యభూత్కుటిల గస్త్వేకాననో౽ హంకః

2

సారంగాయతలోచనా, మధురసాస్వాదోన్మదన్మూర్మిక కృ
త్సారంగాధిక నీలదీర్ఘచికురా, చంద్రోపమేయాననా
సారంగాబ్జజవత్రి సన్నుతల సచ్చాతుర్యమం దర్శిమా,
సారంగాయుత కాంతిదేహకలితా, సౌమ్యా, స్తు, కామేశ్వరీ.

3

మాతశ్శైత్య మహాదయారస సుధా సంపూర్ణయామే యయా
శీతాంశు ప్రభయా, విలాసరమయా, ప్రేమాను సంయుక్తయా,
భక్తానీతి యశోగుణ ప్రకరయా సాహ్లాదయా, పూతయా,
పోతాఖ్యాత సహోదర ప్రణయయా, వీక్షస్వమాంత్వద్దృశా.

4

త్వంతాద్విశక్తిరమలాతవమూర్తిరేవ,
జంతూత్కర ప్రభవ పాలననాశ కర్త్రీ
త్వన్నామ రక్త్య సమభక్తి విరక్తి ముక్తీః
దాతుం సమర్థ మఘజాల లతాలవిత్రిమ్.

5

తవాధీనం సర్వం జగదిద మశేషం సురనుతే!
నవాయుర్నాగ్నిర్వా నజలమపినాభ్రం నపృథివీ,
తవాజ్ఞాముల్లంఘ్య ప్రచలతినకదా భూతనిచయో,
నిలింపానాం శీర్షప్రసవరస సిక్తాంఘ్రి యుగళే ।

6

సదాకల్యాణి! త్వద్భజన పరతంత్రం కురుమనో,
విదేహి, త్వత్పాదద్వితయ మభియుక్తాం మమధియమ్,
త్వదాఖ్యానే సక్తాం తనుమమ ప్రచాంచల్య రసనామ్,
మదీయం పాపౌఘం హర హర హరిబ్రహ్మవినుతే ।

7

నమామి త్వత్పాదౌ, నవతరణిభిన్నాబ్జసుభగౌ,
కరోమి త్వద్ధ్యానం, సకల కలికాలాఘ హరణమ్,
వదామి త్వన్నామ, ప్రతిశత శతాధిక్య ఫలదమ్,
భజామి త్వామేవాఖిల సురమునీనాం శరణదామ్.

8

విధాతుం లోకాన్వా జనయదజ భూతేశ విష్ణూన్
తతః ప్రాకల్పత్త్రైస్త్రిభువనమ శేషం విపుణాతః
సముద్దేశాంతాం సర్వాఘలవ ఘటనా నైపుణియుతాం
త్వామేవేతిధ్యాయే మనసి మమలబ్ధుం సుపదవీం.

9

లోకేషు సర్వేషు వసంతిదేవా, యే సనశక్తాఖిలు సర్వకామాన్
తస్మాత్సమర్థాసి ప్రధామ గా స్త్వంతన్నా మదాతుం త్వయిలోకమాతః!

10

అనంత సంసార పయోధిమాప్లుత స్త్వదీయ భ క్తింయది విస్మరామి,
నతాపతా పుత్రమిమంసుచుఃఖ్ర థాఃదయార సీనప్రతిషిచ్ఛపాల్యతాం

12

భావార్ద్రదృష్టి ప్రచయప్రపాత, ప్రఫుల్ల పంకేరుహపత్రనేత్రే,
త్వద్దృష్టిమాత్రేణ సమస్త విశ్వం, జన్మాభివృద్ధి క్షయమాప్రయాతి.

13

త్వదీయ పాదార్పిత చేతసామయా, విజ్ఞాప్యతేతుభ్యమిదంచ కించిత్
దరిద్రధారార్ణకదాప్యసి సాక్షీ! రక్షతుమాం జన్మశతేషుదేవి ।

14

తవనామ సుధారసపాన రతిం కురుదేవి !మదీయమనో వికృతిమ్
అతి చంచలమాసుగతాంచ మతిం స్థిరతాంనయ దేహి సదాసుగతిమ్.

15

మణికింకిణి నూపుర సంఘటితం సనకాది మునీశ గణాభినుతమ్
నవరక్త సరోరుహ కాంతియుతం,శరణం మమ దేవి!తవాంఘ్రియుగమ్

16

పరమేశము ఖామరికోటినుతం, సకలేప్సితదాన గుణాభియుతమ్,
ఇహనాక సుఖాత్మ జనాభినుతం, శరణం మమదేవి!తవాంఘ్రియుగమ్

17

తవరూప మచింత్య మనంతమజం, ప్రతిభామపిపశ్యతి తేన సుధీః
తవదాసమిమం పరిపాలయమాం, శరణం మమదేవి!తవాంఘ్రియుగమ్

18

భవసాగర సంతరణౌ, చరణౌ, కలయే సతతం తవదేవ్యరుణౌ
మదయుక్తల సత్కలహంసరణౌ,బహుదీన జనోద్ధరణైతుచణౌ.

19

శచ్యాదిదేవవనితా జనతా నతాంఘ్రి
పంకేరుహే ! విమలకోమలగాత్రవల్లి!
సౌవర్ణశోభిమణిమండల కుండలాఢ్యే !
సంఫుల్లపద్మదళరాజితనేత్రయుగ్మే !

20

శ్రీచందనాచ్ఛారద చంద్రికాయా
శ్ఛందోపలాద్ధైమశిలాచ్ఛిశోచ్ఛ
ఆలింగనాచ్ఛ్వయకళత్రమన్యా
శైతాందిశంతే కుచుద్విషిపాతమ్.

21

శ్రియం వాణీం గౌరీం తదితరనిలింపాబ్జ వదనాః
భజంతి ప్రధ్యోయే ఫలమధిక మారాధ్యయుంయం ,
భజంతస్త్వామేవాఖిల సువరదానైక నిపుణాం,
లభేయు స్తత్తచ్ఛ్రతి భువననుత ఖ్యాతచరితే!

22

దదాత్యారోగ్యంత్వం సకల జగతాం భాస్కరవిభుః
కరోత్యైశ్వర్యంతు త్రినయనవిభుః కామ్యజనుషామ్
ముముక్షూణా మిచ్ఛాంనయతిఖలు నారాయణప్రభుః
సదాతార స్త్వతే సకల మివభ క్షేమవరదే !

23

మనోవర్ష్మత్యాగేశశిన మభియాతీతి నిగమైః
పురాణైశ్శాస్త్రైశ్చాప్యపికథితమయం దేవి ! సమయి
త్వదీయంమే చిత్తం ప్రవిశతి పదాబ్జం శుభకరే !
పునర్జన్మాభావాదిహాను ఫలసిద్ధేర్భగవతి !

24

శిరోజేషుశ్వైత్యం దశనపతనం వర్ష్మ శిథిలమ్
హృషీకేష్వస్వాస్థ్యం నభవతిచయావద్భువనుతే
నుతింతే భక్తిం తద్భజనమపిమేకారయ సదా
మదోన్మత్తభ్రామ్యన్మధు కరచల చ్ఛాళికముఖే!

# ప్రార్థన.

—o—

1

శ్రీధవ ! నీదుపాద సరసీజమరంద విశేష మాధురీ
సాధన చిత్త భక్తవర షట్పద సంచయ పుణ్యగీతికా
వీథి విహారము న్సలుపు వేడుక నాకు ననుగ్రహించి, యే
బాధలు జెందకుండఁ బరిపాలనఁ జేయుము నీకు మ్రొక్కెదన్.

2

నిరతంబు న్భవదీయ కింకరుఁడనై, నీరేజ నిర్మగ్న బం
భర సామ్యంబుగఁ దావకీన పదపద్మధ్యాన లీనుండనై
చిరకాలంబు, చరాచరాఖిల జగచ్ఛ్రేణి విరాగుండనై
పరమాత్మా ! ముదమొందు భాగ్యమది ప్రాప్తం బెప్డునాకౌనొకో.

3

దేవుఁడవీవు సర్వజగతీవలయుంబున కొక్కరుండవై
తావక భక్తకోటి ప్రముదంబునకిట్టు లనేక నామరూ
పావళిచేత వారి కనువౌ వరదానము నిచ్చు నిన్నునో
పావనరూప! సంతతము భావనఁ జేయుదు నామనంబునన్.

4

మాయాతీతుఁడవౌచు నిత్యమును నీయాత్మమండలంబంతటి
న్మాయావాగురఁజిక్కి కొట్టుకొని నీమంగానలేకుండఁగాఁ
జేయంజూతువుగాని తావక నుతిం జిత్తంబునం జొన్పనీ
వే యాకారముఁగన్న నీవయని నేనెంచన్ప్రసాదింపుమా !

5

ధీరవిచారు సజ్జన విధేయునిఁ గాననుజేయు, నామనం
బారని సత్కృపాకలితమై, తిరమైజనఁ గ్రూరమార్గ సం
చారవి దూరమై, తగువిశాలతఁ జెందగఁజూడు దీనమం
దార ! సదారతిందవులు తన్భవదీయ పదారవిందమున్॥

# అంజలి.

1

సీ॥ కాళిదాస కవిత్వకాన్తా విహార సం
దనవనస్థానమే తల్లియయ్యొ
అష్టాదశపురాణ శిష్టత్వ సత్తీర్థ
నిలయమే జననియై వెలసి మించె
వాల్మీకి కోకిలవాణీ వినోద ర
సాలమే మాతయై స్తవముగాంచె
భట్టబాణోత్కవిత్వరమణీడోలికా
రూపమే తరుణియై రూఢిగాంచె
గీ॥ భవ్యభవభూతి శ్రీహర్షభాసదండి
భారవిమయూర మాఘ గీర్వాణసుకవి
కవితయే మాతృకాహ్లాదకారమండ
నంబొ, యాభారతాంబకేనతు లొసర్తు॥

2

సీ॥ వైదికాచార సంపన్నభావ నిరూఢ
వాగనుశాసన వాక్సుమముల
సహజవర్ణనరచన సముచిత పద వృత్తి
కలితా కవిబ్రహ్మ కవనసరుల
నుభయభాషా కవితోల్లసితప్రబం
ధ పరమేశ్వరునిసుధానుమముల
సహజపాండిత్య సంస్తవనీయ భక్తపో
తన మృదుసూక్తి మందారములను
గీ॥ భీమసోమన భాస్కర పిన్నవీర
భద్రి సూరన శ్రీనాథ పాపరాజ
కృష్ణరాడష్టదిగ్గజ గీః ప్రసూన
పూజితాంధ్రాంబ పదముల మ్రొక్కువాడ॥

# మిణుఁగురు

1

దినకరుమీఁది కోపరసదీప్తినిఁ గుమ్మరిఁ గొట్టలేక యా
తని ఘటజాలముం జితుకఁ దన్నెడి చాట్పున భూనభంబులం
బెనగొని లోకముల్వొరుసఁ బీల్చెడునట్లు విభీతచాయియై
తనరెడు నీ నిశీథమునఁ దాఘము మిణ్గుర ! యెందుబోయెదో ?

2

భవదీయప్రతిమాన దేహరుచివిభ్రాజత్పథోద్గామియై
నవశోభావహ చిత్రచిత్ర పద విన్యాస మునన్ బతుమాల్
నవరించీ మెఱునేగ దెచ్చుటికి నిస్సాహాయ్యతన్ బ్రేమమా
నవసన్మానముఁ జేతువో? ప్రకృతి సన్మానమ్మె చేసెంచితో ?

3

నీ మెయిచాయ వెల్లెడల నింపుచు నీనిశి మేఘ పార్శ్వ సౌ
దామినిఁబోలుచుం జనముదావహ వౌచునువిశ్వ హృద్గత
ప్రేమ సుధారసమ్మును గవేషణచేయఁగ నేగుచుంటివో ?
యేమియుఁ బల్కవేమి ? నగవేమి ? నసుంగనవేమి ? మిణ్గురా ?

4

నీదగు మానసమ్ము రమణీయతర ప్రకృతి స్వరూప మం
దేది హరించె వాకొనఁటకేఁదను నోమును నోచలేదొకో ?
సాదర బుద్ధితో నిలు నిశాచరభావముఁ జూపుదేలనే
కాదనకిట్టిపాటి యుపకారముఁ జేయఁగఁ జూడు మిణ్గురా ?

5

కొనిపోవంగదె నన్ను నీ వెనుకనే కుంజంపుఁ బుంజానికో
జనసమ్మర్దములేని తావునకొ నిశ్శబ్దంపు దేశానికో
మనసానందముఁ జెందు భూమికడకో మందానిలాశానకో
ఘనమానీంద్ర నివాసయోగ్యమగు నేకాంత ప్రదేశానికో।

# మానవసేవయే మాధవసేవ.

1

బీదలయందనారతము ప్రేమవహించి పరోపకార సం
పాదన తత్పరుండయి యుపాసితి దీనజనార్తినాశకుం
డై ధనదార పుత్త్రిలను నైహికవాంఛలువీడి సర్వదా
మాధవు తత్త్వబోధలను మాన్యతఁజెప్పు నరోత్తముండిలన్॥

2

అతఁడు వసియించు పట్టణమందు రాజు
దాంబి కాదరుఁడౌట నుదార దేవ
ళమ్ము కట్టించె భక్త సల్లాపనార్థ
మెప్పుడా యోగి దంబమ్ము ముప్పుఁగనుట॥

3

దేవ ? భవదీయ నిర్మిత దివ్యహేమ
మయ శుభావహ రమ్య రమావరాల
యమ్ము డిగనాడి నగరబాహ్యమ్మునందు
నుండెనలరుచు యోగి సర్వోత్తముండు॥

4

భక్తుఁడొక్కఁడువేడు సూ భర్త రమ్య
దేవళమ్మున మధురంపుఁ దేనెకొరకుఁ
దివిరి తామరపూవును దేఁటులట్లు
భక్తు లాతనిఁ జెందిరాసక్తిఁగొఁడ॥

5

అనుచు భటుడిట్లు పల్కఁగా మనుజవిభుఁడు
నలుక పొడమిన మనమును నాఁచికొనుచుఁ
జేగి నరవర్యుఁడుండెడి చెట్టుదరికిఁ
బలికె యోగినిఁ జూచి దుర్భావమొప్ప॥

6

తండ్రి! బంగరు దేవళ తలము వీడి
దేవదేవుని ప్రేమసందేశ మీవు
భక్తకోటికిఁ జెప్ప నీ పట్టణంపు
బాహ్యమున నుంట యేలని ప్రశ్నచేసి.

7

మరియు నో యోగిపుంగవ ముఖ్యముగను
లక్షలకు మించు ధనమును వెచ్చఁజేసి
యిద్ది కట్టించలేదొకో ? యిందుమాని
బాహ్యమున నుంట నీకిది భావ్యమగునె ?

8

అన నరోత్తము డాను నీ వనునదెల్ల
నెంచ నిజమౌను బీదల యిండ్లు లగ్ని
బాధచేఁ గాలి కూలిన వత్సరాన
నీవు నిర్మించు నట్టిదీ దేవళమ్ము.

6

నిస్సహాయత బీదలు నిన్ను జేరి
వినెడివారల గుండియల్ బీటవాఱు
నట్లు, వేడియు విఫలత్వ మందినారు
అడవిఁగాచిన వెన్నెల వడువుగాను.

10

వారి రోదన నీయెడ బీకవోయెఁ
గరుణ యేకోశమున నీకుఁ గలుఁగలేదు
శిలయొ వజ్రమొ నీగుండె తెలియదయ్యొ
రాజనాకము నీయెడ సాజమగునె ?

11

ధాత, భవదీయ సృష్టి విధానమందు
మఱచెఁగాబోలు హృదయమ్ము పూట నీవు
సతురాధ్యానమును, జేయు నవసరాన
గాఢముగ నేర్చినావు నకార మొకటె

12
అందుచే కోర్కెధమూని నీయందు దేవుఁ
డకట! బీదలయందు సాహాయ్యహీనుఁ
డైన రాజవు నీవెంతయంచు నాత్మఁ
దలఁచి జేరెను బీదసోదరుల దరికి॥

13
వారినే యాశ్రయించె నవ్వారిఁగాఁగ
దిక్కులేనట్టివారికి దిక్కు దేవుఁ
డనెడి లోకోక్తి వినవె నీ యాలయమ్ము
నీదుగర్వపుఁ జిహ్నంబుగాదె యనఁగ

14
నాదు భావాల నెవ్వఁడు గాదటంచుఁ
బల్కునో నాదునాజ్ఞను బాటిసేయ
కెవడు చరియించునో వానికే మఱియ
రాజ్యమందునఁ దావు దూరానసుండు॥

15
నన్ను నాభావముల నీ వనాదరమ్ము
జేసి మెలగుచునుంటివి దోసమునక
గాన నారాజ్యమందునఁ గాలుపెట్టఁ
దావులేదింక నెటకేనిఁ దరలుమయ్య॥

16
అనవరోత్తముఁడానందమున వచించె
నీవు నీరాజ్యము ననుండి దేవునెటకుఁ
దరిమినాడవో నాయందు దయఁదలంచి
యట్టి బీదల సేవకే యంపుమయ్య॥

17
దేవళమ్మున లేడు నూ, దేవుఁడెంచ
దీనజనరక్షయే వాని దీక్షనుమ్మ
కానదీనతఁ బరగెడు మానవాళి
సేవయే మాకు మాధవసేవనుమ్మ॥

18

భక్తులని దాసులంచును బరమవేత్త
లంచు వెలసినవారిలో నెంచలేదు
దీనజనులందు వెలుఁగొందుఁ గాన వారి
సేవయే మాకు మాధవసేవ సుమ్ము॥

19

మెడను రుద్రాక్ష మాలికల్ మేనబూడిఁ
దాల్చు పట్టుల లేదు బీదల వశాన
గరుణ వెలుఁగొందు దేవుండు గాన వారి
సేవయె మాకు మాధవసేవ సుమ్ము॥

# బిచ్చమెత్తిన రాచబిడ్డ.

1

జననంబందితి రాజనౌచు నదియే జన్మంపుఁ బుణ్యాల్పమో
మనితిన్నైర్మగనుగందకుండ జనసన్మానంబుల న్బొందితిన్
మనమామోద రసాబ్ధి భంగములఁ బల్మారూపి సౌఖ్యంబుల
న్గనితిన్ నాతలిదండ్రులుం బ్రజలు నానందాత్మ నన్గాంచగన్

2

కనులను విప్పిజూడఁగదుఁ గౌతుకము న్భయ మున్బెనంగొన
న్మనసున సంభ్రమం బొదవ మైఁ బులకింపగ సర్వలోకముం
దనకర యుగ్మమూ దటన తానన భాగము సోక మ్రొక్కుటం
గని ముదమందితిం గనులఁ గాంచగ నైతిని గష్టపఁపడన్

3

ధరణిఁబ్రసిద్ధిఁగన్న పరదారులు నాకనుసన్నలోన
దరమున నాజ్ఞశీఘ్రముల దాల్చెడివారలు నన్ను ముద్దుగాఁ
బెరుగుటకోసమే భువిని విశ్వవిధాత సృజించెనంచు నెం
చి, రమణఁ బొంగితిన్ బరవశీకృత భావము నాకు లేమిచే।

4

మరల మరొండు రీతిగను మాటును జీవితమంచు నెంచకే
మురిసితి నెల్లకాలమును ముద్దులు చెల్లునె యెట్టివారికిన్
దురిత ఫలంబు నెంచకయె తోసుకపోవున ? యుచ్చనీచముల్
దరగతివారివచ్చునది తప్పదటంచు నెఱింగితిన్ మదిన్.

5

చూచితి నుచ్చనీచముల చొప్పులు రెండును భూతిలోఁ జవిం
జూచితి రాజవంశమున సోయగమీ దురవస్థ రెండునుం
దోఁచెను నద్వితీయములె తూచగ నాస్థితి తొల్లి యీగతిన్
నీచముగాదు నేడుగననేర్పితి నారక బాధ లిచ్చటన్।

6

దయగలయాంగ్లనాయకు లుదారులు గావున నైమరూప్యముల్
నయము దలంచి పింఛనును నాకయి యేర్పఱపంగ నేను నా
పయినిం గనేమటంచు వరపాలురకీవి వెలుంగఁ జేసితిన్
పయిపయి యప్పు వృద్ధియయె పాపముఁ బోలెను రోజురోజునన్।

7

అప్పనొసంగు దాతలు దయామయులౌటనుఁ జూచి కొన్ని నా
ళ్లెప్పటికేనుఁ దీర్పుదునినెంచియుఁ బింఛనుజప్తు చేయగాఁ
దప్పక జేయఁగావలసె దాస్యపువృత్తులు పొట్టకోన, మా
చొప్పునఁ గొంతకాలమటుఁ జూచితి వేరొకదిక్కు లేమిచే।

8

మానము కూలియుంచు నభిమానము నన్నొకవంకఁ బీకఁ, దీ
ర్మానము లేని యాఁకలియు రాయిడిసేయఁగ నొక్కవంక నేఁ
గానగలేక వేఱుగతిఁ గష్టము నోర్చినఁ బొట్టపోషణం
బౌనను కొన్న వింతకును నంధత నన్వరియించె నక్కటా,

9

ఏమియుఁ దోచకేకడకు నీగతిఁ జంకను జోలిబెట్టినే
నీమెయి బిచ్చమెత్తుకొన నీపురవీధుల దోంతినలందు నీ
యాదిని సంచరించి యమయాతనఁ బొందుచునుంటి లజ్జచే
నామెయి సచ్చె, యర్థమగు నాపరితాపము నేమిసెప్పుదున్

10

రజనీవేళల బిచ్చమెత్తుదువు మార్గా! నీవిదేమంచు నే
పరిజలేసిన్ ననుఁబల్కు వందనము తేపారంగ గైకొన్న యా
నిజరాజ్యానఁ బవల్ శరమ్ము నెటులన్నేఁ జేతునంచందు, నా
నిజమౌగాథ యిదే ముగింతుఁ బయినే నేమన్న సిగ్గయ్యెడిన్.

# అనునయము.

---o---

I

అతులితమైన కష్టదశ నందిన వేళలనైనఁ గాలమే
గతి విపరీతమైన, జనకాదులప్రేమ విహీనమైన, నీ
మతిచలియింపనీయక నుమానము మానుము మానసమ్ములో
గతకలుషాత్మ! యోయబల! కన్నుల బాష్పము రాల్పఁ బోకుమా

2

రమణీయాద్రి నదీలతా ప్రకరరాజన్మహారణ్య వం
గమ శోభావహరాగ పల్లవ సుమగ్రామాభి రామాకర
క్రమసౌందర్య సహస్రపత్ర కుముదక్రౌంచోర్మిమాలా సరః
కమనీయ ప్రతిభాసమా, ప్రకృతి రంగస్థాన విశ్వమ్ములో

3

మనసున కింపుఁ గొల్పు సుమమంజరు లందిలకింపు కర్ణముల్
దనుపు పికస్వనంబులను దామరతేనియలాను బంభర
ధ్వనులను నాలకింపు, విరితావులు, వీచుల శీతలమ్ముఁగా
కొను, మలయానిలమ్ము గొను, కోమలి! యియ్యవి దుఃఖహేతువా

4

కోమలమైన యీప్రకృతి కోకిలవాణిరో దుఃఖనాశకం
బౌ, మనమందుఁ దాపమును నందఁగ నేటికి ? దేనికోసమై
కామిని దుఃఖమందుదువొ, కాంచుచునుంటివొ, దేని నద్దియే
యామహనీయ లీలలనియాత్మఁ దలంపుము మిథ్య సర్వమున్.

5

ప్రేమతరంగడోలికన భేదముగాఁ గనఁదూగ మాధురీ
ధాముని విశ్వలీలల సుధామధురోక్తులఁ బాడ జంకుగాం
కేమియులేక వీణనలరించి నినాదముసేయు మాధ్వసిన్
గామముఁ దీరనైక్యమును గాంతుము నీవును నేను గోమలీ!

# నిశీథకాంత.

1

సంజను సలంకార మీవు సంతరించి
రాగపూరిత హృదయాంతరాళవగుచు
రమణ నాదగు మనసున రాగబీజ
ముప్పతిలఁ జేసినావు నిశోత్పలాక్షి!

2

కొంపు సోఁపుల నిరసించు నింపుఁగలుగు
సోముఁడను గోము బొట్టును సొగసుఁ గులుకు
మోమునందిద్ది నన్ను విమోహ బద్ధుఁ
జేయ నెంచితో? నీవు నిశీథకాంత!

3

మెఱవుమెయి తళ్కుఁ గుల్కుల మెఱపినీవు
మేవ సవరించి యిటు మెయి ల్మొలిముసుఁగు
తారకావళి తారకద్యుతుల దిశలఁ
జిమ్మ వంచింపఁ దలఁతె? నిశీథకాంత!

# దీనాలాపము.

1

సత్య ధర్మ దయా శౌచ శాన్తి రూప!
భరతభూప్రియపుత్ర ! పావనచరిత్ర
యాదియాంధ్రుల మమ్మల నాదరించి
దీనవాక్యాల వినుము గాంధీమహాత్మ!

2

తరమెఱుఁగని భరతసోదరుల మదినిఁ
బుట్టు కలహాలదయను బోఁగొట్టఁదలఁచి
మధ్యవర్తిత్వమూనియోమాన్యచరిత!
ప్రజలు భళియన బొంబాయి వచ్చితీవు.

3

తండ్రి! నినుఁజూడఁ దండోపతండములుగ
నన్నిజాతుల మానవులవతరించి
యమల భవదీయ కార్య సమాప్తికొరకు
దీవనల్ తంతిమూలానఁదీర్చినారు.

4

ఉన్నతాశమభేదత నొప్పియున్న
జాతులొక్కటి జేయుచే నీతియనుచు
గట్టియుంటివి కరమునఁ గంకణమ్ము
మనను శంకించె నది లోహమయమొ తృణమొ ?

5

సతుఁడ వెల్లరకును జగద్ధితుఁడవైన
పరమధర్మజ్ఞ నినుఁ జూడ వచ్చినట్టి
యిందఱఁబోలె వచ్చితి మేము గూడఁ
జనమువేఱల నొక్కటే ప్రాణులెల్ల.

మాదురంగునఁబట్టియేమాలలంచుఁ
నెంచి ముట్టక నెట్టిరి యిట్లు మమ్ము
గాలువెట్టగ బొంబొయి గాళ్ళమందుఁ
దలము లేదయ్యొ మాకర్మ ఫలమదేమొ ?

జాతియుత్కృష్టమయ్యెను నీతిగాదు
భారదాంబా కుమారక భావమెల్లఁ
దలఁగిపోయెనె ? తమసహోదరతనెట్లు
తిరముఁ గావింప నెంచిరో తెలియదయ్యొ.

చిన్మయాత్మక హృదయవిచ్ఛిన్నమైన
భవ్యభారతజనని హృద్భల్లమైన
తత్వవేత్తల స్వాంత విదారిమైన
కార్యకలనకు మాకర్మ కారణమ్ము.

ఎట్టికార్యంబు నెఱవేర్పఁ బుట్టినావొ
యద్దినేటికి నెరవేరదయ్యొ దాని
కేదియోమీరుఁదులోటని యెన్నవలెనొ !
మాదుకర్మపుబల మహామహిమయేమొ.

ఈదునకు నీకు దెబ్బది యేఁదులయ్యె
నైననీ కార్య మిప్పటి కగుటలేదు
కుదురఁ జేయుము కర్మంపు గొదువలెల్ల
ధన్యతం జెందు మిఁక నైన ధరణిలోన

జీవితాశయ సంపూర్తి చేకురంగ
జన్మసాఫల్యమందఁగ జగము వొగడ
నాత్మబలమూ తగాగ మహాత్మమమ్ము
నుద్ధరింపఁగఁ జూడుమీ యుర్విలోన

వందు మార్కొండకై హరివాసరములు
బ్రహ్మవ్రాఁతకు నెవ్వఁడు బదులువేయు
కర్మసూత్రాన కెవ్వఁడు కట్టువడఁడు ?
భాగ్యహీనుని నెవ్వఁడు బాగుసేయు.

---

# అన్వేషణ.

రాగములాఁపించి యనురాగముతో శ్రుతిమేళగించి యా
త్యాగయ కీర్తనల్ మురజతాళములుల్లసిలంగ పాడు స
ద్భాగవతార్యులంచు భువి భాసిలు భక్తుల మందిరంబులన్.
నేగమునింపలేవు గననేగితి బీదల పర్ణశాలలన్.

వీనులకెంతయు న్నిమ్రుల వీఁదొనరించెడి వీణెమీటులోఁ
గానఁగవత్తువంచు ఘనకాంతను గాంచితిగాని చిత్రమా
డీనుల యార్తనాదములఁ దేలుగునఁటివి వీర్యసంపదన్
భూనుత దేహదార్ఢ్యమును బొంది విభాసిలు 'గామ' సన్నిధిన్

నేనినుగాంచలేనయితి నిత్యము దేశపు కొల్వు సందిమున్
మేనును ముంచి తేలుచు నిమేషము కాలము వ్యర్థపుచ్చకే
ధీనిధియౌచు శల్యమయదేహముఁ దాల్చిన గాంధిలోననీ
దానను పోయగంబుఁగని దాల్చితి మోదము విశ్వలీలకా!

తోరపు సంపదందు తులఁదూఁగుచు స్వేచ్ఛమరుత్పరంపరల్
వారకఁ బీల్చుచుండు ధనవంతులచేర్పున నుందువన్న స
ద్భారత దేశసేవయను భారపు నేరముఁబొంది జైలులో
సారవిహీనత న్మలఁగు జవ్వరుచెంతనుఁ గాంచఁగల్గితిన్.

జ్ఞానము కాదు సొత్తు సరిగానను నాకిలనంచు నెంచి గ
ర్వానఁ జెలంగు పెద్దలను వారి కడంగననైతి మాటలే
రాని యుయాలలోన మధురంపు శుచిస్మితులైన బాలురన్
మానుగఁ గేళిఁదేల్చు పరమప్రియభావుని నిన్నుఁ జూచితిన్.

# కాకమా !

కాకమ! నీవు మంజుల పికస్వనము న్విని డెందమందుఁ జీ
కాకను బొంది యీరసనుఁ గైకొననేమి ఫలంబు రచ్చలో
నీకగునో కొ— గౌరవము నిన్న సజాతియె మెచ్చుగానని
పోకడ మానుమింక నగుబో! విధినేతకు మారుసేయఁగా!

శుకపిక హంసలన్నిపుల సూరిజనమ్ములునైన మెచ్చ స
త్యకుడు స్వకీయ కౌశల మహత్వ మెలర్పఁగఁ జేసినాఁడహో!
సకల జగన్నియామకుని శక్యమె? కాదననీకు గాకయీ
తికమక బుద్ధియీను జగతిన్ గల జీవుల కర్మమెట్టిదో!

పెంచినవారిపై దిగులఁ జేర్మి వహించుట వారి చెడ్డకు
న్మంచికిఁ దానఁబాల్గొనుట మాన్యపు లోకపుఁ బాడియాటనీ
వెంచక వాయసమ్మ! తగవే కనువేదుకఁ గల్గియుంటఁ బ్రౌ
పంచక ధర్మమర్మములఁ బాగుగనేర్చి సుఖంపు కాకమా!

పోలుదు కొంతరూపమునఁ బోల్పఁగఁ గోకిలఁగీరరాజము
న్బోలఁగ లేవుగా జనమనోహర కంఠనినాదశోభ వా
గ్జాలమదెట్టులబ్బును? విచారము సేయవు మానసమ్ములోఁ
జాలునసూయ యన్యునెడ శాంతి వహింపుము నీవు కాకమా!

రంగులుదాల్ప నిన్ను భళిరా! యని మెచ్చుచు నీదుజాతి తీ
యంగను నట్టి చిత్రము లియూధము గామిని సన్యాపతుల్లో
వెంగలివంచు నన్యశుభవీక్షణ కోర్వవటంచు నెంచు నీ
తింగలడోలె నోపరసతీ కుచచేలకహార! కాకమా!

# గ్రంథాలయము.

అమితధనంబుకన్నఁ దన యాప్తులకన్నను దల్లికన్నఁ గూ
రిమి సతికన్న భోగలహరీప్లుతికన్నను మైత్రికన్న స్వే
చ్ఛమును మనోజ్ఞ భావ హితశాలియసౌ సలగ్రంథకోటి భా
సమయిన గ్రంథ సద్మమిల సత్యమునారయ శ్రేష్ఠమౌఁజుఁడీ !

ప్రతిదినమ్మును మనము సద్భక్తితోడ
దేవుని భజింపఁగా నెంచి దేవళమ్ముఁ
జేరుచుందుమొ యెటులట్లు జేరవలయు
గ్రంథనిలయమ్ము నిహపర కామదమ్ము.

మంచిగ్రంథాలఁ జదువఁగా మానసాన
నుత్సహించెడి వారలీ యుర్విలోన
బంధువుల మిత్రవర్యుల బాంధవమ్ము
కంటెఁ బ్రీతిగఁ దలఁతురు కావ్యహితుల

ప్రతిదినంబును హితబోధ పాప పుణ్య
సరణి నెఱిఁగించుచుండును విరివిగాను
గానఁ గావ్యంబు మించిన ఘనతరంపు
నేస్తమేలేదు లోకాన వాస్తవముగ.

తనువును రక్తమాంసములు ధారగఁబోసి మునీంద్ర బృందముల్
ఘనతర సత్తపంబుఁ జిరకాలముఁ జేసి గడించి లోకమం
దున దిగవీడినట్టి పరితూఁగని సత్ఫలితంపు రాశియే
యనఁదగు కావ్యకోటికి సముంచిత ధామము గ్రంథసద్మమా.

కలఁ దలఁ బోసడంచు ఘన కష్టముల న్దొలఁగించు బన్నముల్
నలి నలిఁజేయు దుఃఖముల నాశమునుం బొనరించు బుణ్యముల్
గలుగఁగఁ జేసి పాపముల ఖండనఁ జేయుచు బుద్ధిమాంద్యమున్
గళిత మొనర్చు కావ్యములు కల్పతరుల్ పృథివీస్థలంబునన్

ఊర దేవాలయమ్ములు భూరిసత్ర
ములును సావళ్లు సొగసగుఁ బూలతోఁట
కలుగకున్నను గొఱతఁ దిగాదు గ్రంథ
నిలయమొక్కటి లేకున్న విలువలేదు

మనపెద్దల్ గడియించి దాఁచు ఘన సన్మాన్యంబు లేకావ్యముల్
మును లార్జించు పవిత్రసత్తప పయఃపూరంబులే పాత్రముల్
మన హిందూప్రజ మూటగట్టిన మహామాణిక్యముల్ గబ్బముల్
వినువీధి న్విడనాడి భూతలముపై వేంచేయు కల్పంబులే.

కావల కావ్యముల్ దలఁపఁగా భువిలోపలఁ గావ్యమాత్రముల్
జీవుల మూఁడుకాలముల జీవితముల్ హృదయ ప్రవర్తన
భావములాశయంబులును బాపముఁ బుణ్యము నుచ్చనీచముల్
ఠీవిని దెల్పు జోస్యులనుఁడీ తలపోయఁగ గ్రంథరాజముల్

# ఆత్మతర్పణము.

జగతిమూర్తిభవించిన సత్యదేవుఁ
డవ్యయాధ్యాత్మికానంద దివ్యమైన
జ్యోతి, ధర్మానుకెల్లనురీతి, నీతి
తెలుపు, భారత ప్రజకెల్లఁ దెలివికన్ను॥

వీరభారత భూమాత పెద్దకొడుకు
మనలనేగాదుసూ సమస్త మహిని
దుఃఖవారిధిలోఁ బడద్రోచి విశ్వ
లీలురూపానఁ దాను విలీనుఁడయ్యె.

కమనీయ గుణు విశ్వకల్యాణమూర్తినిఁ
గాంచు భాగ్యమదింకఁ గలుగదయ్యె
మృదుపదలాలితామేయ గంభీర సం
భావ భావవిశిష్ట పావనంపు
వాక్సుధారసము నింపారఁ గ్రోలెడి పుణ్య
మీభారత ప్రజకింక లేదు
విపుల భారతదేశవియ దుదయంబునఁ
దనకీర్తి కిరణముల్ దశదిగన్త
విశ్వమున వ్యాప్తిఁజేసిన విశ్వమూర్తి
నిఖిల జన హృదయాకర్షణీయమూర్తి
సకల హరిదన్త పర్యాప్త చారుకీర్తి
పరగిరింగ్రుంకె భారత భానుమూర్తి.

అకట ! నమ్మకముంచ కాధ్యాత్మశక్తి
పైన వైజ్ఞాన శక్తిపై ప్రబలమైన
యాస్థఁగల్గి చరించెడి యాంగ్లజాతి
కందఁజేసెనా యాధ్యాత్మి కాతిశయము.

నెవ్వఁడాతఁడు మమువీడి యెందుఁబోయె
జాతి ధర్మపు సిద్ధాన్త విశాలచరిత.
జాటి చూపించి మించిన చరితుఁడెవడొ
పగతు నెడఁగూడఁ గోపంపు భావమైన.
నెఱుగఁ డెవ్వఁడు పరులకు నట్టివారి
కేనిఁ ద్రికరణశుద్ధిగ నెన్నడేనిఁ
బరుసపుం బల్కు లెఱుఁగని గుఱుతరంపు
శాంతమూర్తి యటంచు నజాతశత్రుఁ
డనుచు నెవ్వఁడు పేరు ప్రఖ్యాతిగాంచె
నట్టి మహితాత్ముఁడీ భువి నస్తమించి
ధేనువుంబాయు వత్సంపుఁ దీరుగాను
బలము తొలఁగిన యుత్సాహ పటిమగాను
కోరలుఁదీయు పులి బోసినోరుగానుఁ
బుడమిఁ బూనాదు లేనట్టి గోడగానుఁ
బ్రజలఁ గావించి యయ్యయో! బంధురంపు
నంధకారానఁ బడద్రోచి యరిగెనటకు ?

సత్యం బహింసయు నిత్యంబు నుచ్ఛ్వాస
నిశ్వాసరూపమై నెగడె నెవఁడు
ఎవని సిద్ధాంతమ్ము నేకజాతియు మాన
వత్వంబటంచును వరలినదియొ !
ఏమహాత్ముని జీవితేచ్ఛా విధానానఁ
బరమార్థమయ్యెఁ బ్రపంచశాంతి
ఎవ్వాని మనుగడ ఎల్లవేళలయందు
విశ్వకల్యాణమై వినుతిగాంచె
ఎన్నినోములనో నోచి యేమహాత్మ
మహిత పద్ముని భారతమాత గనెనొ
అట్టి మహనీయుండౌ "గాంధి" యఖిలలోక
జనహృదంతర గోళాన మునిగినాఁడు.

# వేఁగుఁజుక్క.

నీలాల బాటపై
నీటుగా నిలిచితివి,
అరుణకాంతికి మున్నె
అల్లఁదోఁచితివి
జీవుల మేల్కొల్ప
తీవిదయచేసితివి
వేఁకువందోఁచునో !
వేఁగుఁజుక్క !
ప్రియురాండ్రు కౌఁగిళ్ల
ప్రిదులనీకుండంగ
మావినోక్కులచొక్కు
మొక్కవోకుండంగ
మెచ్చుగా జంటగై
హెచ్చరికఁజేయంగ
అల్లనల్లనఁ బంపి
పిల్లవాయువులఁ
జక్కగా రతిశ్రమ
సంజాతమైనట్టి
జలకణమ్ముల నీవు
జానుగా కడిగి
జంటచే దవ్వై
సంగతులం గైకొందు
సాగములఁ గుల్కునో !
చుక్క ! నీవు
కొక్కొరోకోయంచు
కోడిచే కూయించి

జగమునంతయు నీవు
చయ్యనమేల్కొల్పి
అంధకారమునుండి
ఆవలదాటించి
వెలుగులం జూపంగ
వేవేగనీవు
చుక్కానివై తోచు
చక్కనీచుక్క !
చిన్నారి పొన్నారి
చిరుతపాపలు లేచి
చిలిపిచేష్టలుచేసి
చైతన్యమూర్తులై
సన్నకసన్నక
స్తన్యముల్ గ్రోలియు
తల్లులనానంద
తరంగలం దేల్చి
చిన్ని తేనవ్వుల
వెన్నెలదొంతరన్
వింతయగానీకాంతి
సంతతిం గల్పుచు
మించియువేణు, వి
పంచీస్వనమ్ముల
కలరవమ్ముల చిందు
గళరవమ్ములతో
పావలు నీలీల
పాడుచున్నారు
వెల్లుతళుక్కులగుల్కు
వేగుఁజుక్క !

# భరతవాక్యము.

———o———

స్వార్థమనియెడి చీకటి పద్మమందు
మునిఁగి తేలుచుఁ గానక పుణ్యసరణి
ముక్తికాంతకు దూరగమై ముగ్ధమైన
దేశమందున నిస్స్వార్థ దీపకళిక
వెలుఁగు జెందఁగ వెలిగింతవే సఖుండ !
కలిమిలేములు పృథివినిఁ గష్టసుఖము
లెంచఁ గావడి కుండలటంచుఁ దలఁచి
సోదరత్వము మదిలోనఁ బాదుకొనఁగ
శక్తివంతము నిహపర సాధనంబు
సకల సస్యాఢ్యశాల విశాలమైన
భరతభూమిని జనియించు భారతీయు
లెల్ల సంఘపు విషయములెల్లనందుఁ
దెలిసికొనఁగను వీరుల దివ్యగాథ
లలవిపశ్చిద్వరుల దివ్యాలపాలు
హృదయ కుహరాల నినదింపఁజేయ స్వార్థ
రహితమన్ దీప కళిక విరాజిలంగ
యత్నమొనరింపవే ! మిత్రరత్న ! నీవు
అంతమేలేనియట్టి దురాశజనుల
యంతరంగాలఁ దిరిగి తమాషఁ జేయు
కోట్లకొలఁదిగ ధనములఁ గుప్పవేసి
మురిసిపోవుచు కన్నులు మూతపడఁగ
గర్వమనియెడి చీకటి గాఁతిలోన
జాతి తిరుగుచు దిక్కుల జాడఁగనక
దివ్వెకోసము నిటునటు దేవురించుఁ

గానసంతృప్తియను దీపకళికనీవు
తోరగ వెలిగించి గట్టెక్కు త్రోవజూపు
భారతీయ తదేశానఁ బాదుకొనగఁ
బ్రజలలోపల నైక్యభావమ్ము కుదురఁ
గుమతులెల్లను గుతలానఁ గూలునట్లు
సంఘ గౌరవ భావమ్ము జరుగునట్లు
శాంతియుతముగ రాజ్యమ్ము సాగునట్లు
భక్తిసంపన్న మానసాసక్తితోఁడ
దేశమందున నిస్స్వార్థదీపకళిక
వెలుఁగుఁజెందఁగ వెలిగింపవే నఖుండ!